జై శ్రీమన్నారాయణ!



పిళ్ళైలోకాచార్యులవారు సాయించిన

# తత్త్వత్రయము

లోకాచార్యాయ గురవే కృష్ణ పాదస్య సూనవే
సంసారభోగిసందష్టజీవజీవాతవే నమః

పరమహంస పరివ్రాజకులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ
జీయరుస్వామివారు అనుగ్రహించిన

**తెలుగు అనువాదముతో**

ప్రకాశకులు
**జీయర్ ఎడ్యుకేషనల్ ట్రస్ట్**
సీతానగరం - 522 501
గుంటూరుజిల్లా, ఆం.ప్ర.,
☎ : 0866-426929.
*E-mail :* jethyd@hd1.vsnl.net.in

Rs 10-00

శ్రీమన్నారాయణ రామానుజ యతిభ్యో నమః

# మంగళాశాసనములు

సత్సంప్రదాయ ప్రచారంకోసం సనాతన ధర్మపరిరక్షణం కోసం మహోద్యమం చేపట్టి దాన్ని శాఖోపశాఖలుగా విస్తరింపచేసి దాని ఫలాలను జనావళికి అందేట్టు చేయటానికి తమ జీవిత సర్వస్వాన్నీ సమగ్రంగా సమర్థంగా సంతోషంగా సమర్పించిన ప్రాతస్మరణీయులు శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు.

శిక్షాశిబిరాలు, ఉపన్యాసగోష్ఠులు, శ్రీరామక్రతువులు, స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాలు, బ్రహ్మయజ్ఞాలు, సహస్రకుండ లక్ష్మీనారాయణక్రతువులు, గ్రంథ ప్రకటనాలు, పత్రికాప్రకాశనం ఇట్లా ఎన్నో విధాల ఆసేతుశీతనగం సత్సంప్రదాయం వ్యాపించటానికి అపూర్వమైన అద్భుతమైన కృషిని కావించినారు శ్రీవారు.

1947లోనే భక్తినివేదన పత్రికను ప్రారంభించి తాము వ్రాసి,పండితుల చేత వ్రాయించి సంప్రదాయానికి పుష్టిని చేకూర్చినారు.

సత్సంప్రదాయం సాధారణ జనావళికి అందుబాటుకు రావాలన్నది శ్రీవారి సదాశయం. మన గ్రంథాలన్నీ చాలా వరకూ సంస్కృతంలో, తమిళంలో ఉన్నాయి. అవి తెలుగువారికి లభించాలి. అందుకోసం తామే చాలా సత్సంప్రదాయ రహస్య గ్రంథాలకు ఆంధ్రానువాదాలు వ్రాసి భక్తినివేదనకు అనుబంధాలుగా ప్రకటించేవారు.

శ్రీ పిళ్ళలోకాచార్యస్వామి అనుగ్రహించిన తమిళభాషలోని తత్త్వత్రయ గ్రంథానికి శ్రీస్వామివారు వ్రాసి భక్తినివేదన అనుబంధంగా ప్రకటించిన ఆంధ్రానువాదాన్ని భక్తినివేదన సంపాదకులు శ్రీవారి తిరునక్షత్రోత్సవ సందర్భంగా పునర్ముద్రణం కావిస్తే జిజ్ఞాసువులకుపకారకంగా ఉంటుందని మాకు సూచించగానే 'మంచిది' అన్నాం.

శ్రీరామానుజవాణీవారు గ్రంథాన్ని చక్కగా ముద్రించినారు.

శ్రీశ్రీశ్రీ పెద్దస్వామివారు రచించిన మిగిలిన గ్రంథాలను కూడా ప్రకటిస్తే బాగుంటుందనుకొంటున్నాం.

జిజ్ఞాసువులకు ఈ గ్రంథం ద్వారా సత్ సంప్రదాయ స్వరూపం చక్కగా తెలుస్తుందని విశ్వసిస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ!

శ్రీమతే రామానుజాయ నమః
అస్మద్గురుభ్యో నమః
శ్రీమల్లోకగురవే నమః
పిళ్లైలోకాచార్యులవారు సాయించిన

# తత్త్వత్రయము

లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్యసూనవే ।
సంసారభోగి సందష్ట జీవ జీవాతవే నమః ॥

## చిత్ప్రకరణము

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| 1) ముముక్షువాన చేతననుక్కు మోక్ష ముణ్డావెహ్రాతు, తత్త్వత్రయజ్ఞాన ముణ్డాకవేణుమ్. | 1) ముముక్షువైన చేతనునకు మోక్షము సిద్ధించుటకు తత్త్వత్రయ జ్ఞానముండ వలయును. |
| 2) తత్త్వత్రయమావతు - చిత్తుమ్, అచిత్తుమ్, ఈశ్వరనుమ్. | 2) తత్త్వత్రయ మనగా :- చిత్- అచిత్- ఈశ్వరుడున్ను. |
| 3) చిత్తెన్గిఱతు - ఆత్మావై. | 3) ఆత్మను 'చిత్' అని అందురు. |
| 4) ఆత్మస్వరూపమ్, "శెన్రు శెన్రు పరమ్బర మాయ్" ఎన్గిఱపడియే దేహేంద్రియ మనః ప్రాణ బుద్ధి విలక్షణమాయ్, అజడమాయ్, ఆనన్దరూపమాయ్, నిత్యమాయ్, అణువాయ్, అవ్యక్తమాయ్, అచిన్త్యమాయ్, నిరవయవమాయ్, నిర్వికారమాయ్, జ్ఞానాశ్రయమాయ్, ఈశ్వరనుక్కు నియమ్యమాయ్, ధార్యమాయ్, | 4) 'చిత్' యొక్క స్వరూపము - "శెన్రు శెన్రు పరంపరమాయ్" అను .... పాశురమున తెలిపినటుల, దేహము, ఇంద్రియములు - మనన్సు - ప్రాణము - బుద్ధి వీటన్నిటి కంటెను విలక్షణమై, అజడమై, అచింత్యమై నిరవయవమై, నిర్వికారమై, జ్ఞానము నకాశ్రయమై, ఈశ్వరునకు నియా మ్యమై, ధార్యమై శేషభూతమై |

చిత్ప్రకరణము

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| 5) ఆత్మస్వరూపమ్ దేహాది విలక్షణ మానపడి యెన్నెన్నిల్. | 5) ఆత్మ స్వరూపము దేహాదులకంటెను విలక్షణమైన దెటుల ననగా - |
| 6) దేహాదికళ్ 'ఎన్నుడైయ దేహాదికళ్' ఎన్ను ఆత్మావిల్ వేఱు పట్టుతోత్తుకై యాలుమ్, "ఇదం" ఎన్ను తోత్తుకై యాలుమ్, ఆత్మా "నాన్" ఎన్ను తోత్తుకై యాలుమ్ ఇవై యొరుక్కాల్ తోత్తి యొరుక్కాల్ తోత్తా మైయాలుమ్, ఆత్మా ఎప్పోతుం తోత్తు కైయాలుమ్, ఇవై వలవాకై యాలుమ్, ఆత్మా ఒరువనాకైయాలుమ్, ఆత్మా ఇవత్తిల్ విలక్షణ నెన్ను కొళ్ళవేణుమ్. | 6) దేహాదులు "నాయొక్క దేహాదులు" అని ఆత్మకంటె భిన్నములుగా తోచుట వలనను "ఇది" అని తోచుట వలనను, ఆత్మ "నేను" అని స్ఫురించుటవలనను, దేహాదులు ఒకప్పుడు ఉండి, మరొకప్పుడు ఉండకపోవుట వలనను, ఆత్మ ఎప్పుడును కూడ స్ఫురించునదై యుండుటవలనను, దేహాదులు అనేకములగుట వలనను - ఆత్మ ఒక్కటే యగుట వలనను, ఆత్మ దేహాదుల కంటెను విలక్షణమైనదని, గ్రహించవలయును. |
| 7) ఇన్దయుక్తికళుక్కు క్కణ్ణ క్రీ వుణ్డే యాకిలుమ్, శాస్త్రబలత్తాలే ఆత్మా దేహాది విలక్షణనాకక్కడవన్. | 7) ఈయుక్తులకు అపవాదములున్నను, శాస్త్ర బలముచే ఆత్మ దేహాదులకంటె విలక్షణమైనదిగ తెలుసుకొనబడు చున్నది. |
| 8) అజడమాకై యావతు - జ్ఞానత్తై యొ క్రీయ వుం తానే తోత్తుకై. | 8) అజడమైన దనగా - జ్ఞాననిరపేక్షమై స్వయముగా స్ఫురించుట. |
| 9) ఆనన్దరూపమాకై యావతు సుఖ రూపమా యిరుక్కై. | 9) ఆనంద రూపమైన దనగా - సుఖ రూపమైనదై యుండుట. |
| 10) ఉణర్న్దవన్ 'సుఖమాక వుఱఙ్గినే' నెన్గైయాలే సుఖరూపమాకక్కడవతు. | 10) సుషుప్తి స్థితి నుండి నిద్ర మేల్కొనిన వాడు 'సుఖముగా నిద్రించితిని' అని అనుటచే ఇది సుఖరూపమైనదగు చున్నది. |
| 11) నిత్యమాకైయావతు-ఎప్పోతు ముణ్డాకై. | 11) నిత్యమైనదనగా - ఎల్లప్పుడు నుండుట. |

| ద్రావిడము | చిత్రకరణము | ఆంధ్రము |
|---|---|---|
| 12) ఎప్పోతుముణ్డాకిల్, జన్మమరణఙ్గళుణ్డా కిఅవడి యెన్నెన్నిల్, జన్మమావతు దేహసంబన్ధమ్, మరణమావతు - దేహవియోగమ్. | | 12) ఎల్లప్పుడు నుండునదైనచో జన్మమరణము లెటుల కలుగుచున్నవి యనగా, జన్మమనగా దేహముతో సంబంధము, మరణమనగా దేహముతో వియోగము. |
| 13) అణువానపడియెన్నెన్నిల్. | | 13) అణువైన దనుట యెటుల ననగా - |
| 14) హృదయప్రదేశత్తిల్ నిన్ఱు ముత్క్రమిత్తు ప్పోవతు వరువతా మెన్ఱు, శాస్త్రమ్ శొల్లుకై యాలే, ఆత్మా అణువాకక్కడవతు. | | 14) హృదయ ప్రదేశమునుండి, ఉత్క్రమించి పోవును, మరల వచ్చును, అని శాస్త్రము తెలుపుచుండుటచే ఆత్మ అణువని తెలియుచున్నది. |
| 15) అణువాయ్ హృదయత్తళవిలేనిఱ్కు మాకిల్ శరీరమెఙ్గు మొక్క సుఖదుఃఖఙ్కళై భుజిక్కిఱ వడి యెన్నెన్నిల్. | | 15) అణువై హృదయమునందు మాత్రమే నిలిచి యుండినచో శరీరమందంతటను సుఖదుఃఖముల ననుభవించుట యెటుల పొసగుననగా |
| 16) మణిద్యుమణిదీపాదికళోరిడత్తిలే యిరుక్క, ప్రభై ఎఙ్గు మొక్క వ్యాపిక్కు మాప్పోలే జ్ఞాన మెఙ్గు మొక్క వ్యాపిక్కై యాలే యవత్తై భుజిక్క-త్తట్టిల్లై. | | 16) మణిగాని, సూర్యుడుగాని, దీపాదులు గాని ఒకేచోటు నందుండగ వాని కాంతి అంతటను వ్యాపించు నటులనే జ్ఞానము అంతటను వ్యాపించుట ద్వారా సుఖదుఃఖాదులనన్నిటి ననుభవించుటలో ఆటంక మేమియు లేదు. |
| 17) ఒరువ నేకకాలత్తిలే యనేక దేహఙ్గళై పరిగ్రహిక్కిఱతుమ్ జ్ఞానవ్యాప్తియాలే. | | 17) ఒకే వ్యక్తి ఏకకాలములో అనేక దేహములను పరిగ్రహించుటయు కూడ జ్ఞానవ్యాప్తి చేతనే. |

చిత్రకరణము

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| 18) అవ్యక్తమాకైయావతు - ఘట పటాదికళై గ్రహిక్కిఱ చక్షురాది కళాల్ తోన్ఱాతిరుక్కై. | 18) అవ్యక్తమైనదనగా - ఘట - పటాదులను గ్రహించునట్టి నేత్రాదులద్వారా గ్రహింపబడకుండుట. |
| 19) అచిన్త్యమాకైయావతు - అచిత్తోడు సజాతీయం ఎన్ఱు నినైక్క వొణ్ణాతిరుక్కై. | 19) అచింత్యమైనదనగా - అచిత్తుతో సజాతీయమైనదని తలంచుటకు కూడ నవకాశము లేనిదై యుండుట. |
| 20) నిరవయవమాకైయావతు - అవయవ సము దాయమన్ఱిక్కే యిరుక్కై. | 20) నిరయవమైన దనగా - అవయవముల సముదాయ స్వరూపము గానిదై యుండుట. |
| 21) నిర్వికారమాకైయావతు - అచిత్తుప్పోలే వికరిక్కై యన్ఱిక్కే యొరుపడి ప్పట్టిరుక్కై. | 21) నిర్వికారమైన దనగా - అచిత్తువలె వికారము లేకుండగ ఒకేవిధముగ నుండుట. |
| 22) ఇప్పడి యిరుక్కైయాలే శస్త్రమ్, అగ్ని, జలమ్, వాతమ్, ఆతపమ్ తొడవ్ తొడక్క మానవత్తాల్ ఛేదిత్తల్, దహిత్తల్, ననైత్తల్, శోషిప్పిత్తల్, శెయ్‌కైక్కు యోగ్యమా యిరుక్కుమ్. | 22) ఇట్లుండుటవలన శస్త్రము, అగ్ని, జలము, వాయువు, ఎండ మున్నగు వానిచే ఛేదించుట, దహించుట, తడుపుట, ఎండింపజేయుట మున్నగు వాటిని జేయుటకు అవకాశము లేనిదై యుండును. |
| 23) ఆర్హతరాత్మావై దేహపరిమాణన్, ఎన్నార్ కళ్. | 23) బౌద్ధులు ఆత్మను దేహమంత పరిమాణము గలదనిరి. |
| 24) అతు శ్రుతివిరుద్ధమ్. | 24) అటులనుట శ్రుతివిరుద్ధము. |
| 25) అనేక దేహఙ్గళై పరిగ్రహిక్కిఱ యోగికళ్ స్వరూపత్తుక్కు శైథిల్యమ్ వరుమ్ | 25) అనేక దేహములను పరిగ్రహించునట్టి యోగులయొక్క స్వరూపమునకు శైథిల్యము సంభవించును. |
| 26) జ్ఞానాశ్రయమాకై యావతు, జ్ఞానత్తుక్కిరుప్పిడమా యిరుక్కై. | 26) జ్ఞానాశ్రయమైనదనగా - జ్ఞానముండుటకు స్థానభూతమై యుండుట. |

| ద్రావిడము | చిత్రకరణము | ఆంధ్రము |
|---|---|---|
| 27) ఆత్మా జ్ఞానత్తుక్కిరుప్పిడ మన్ఱిక్కే జ్ఞానమాత్రమాకిల్. | | 27) ఆత్మ జ్ఞానముండుటకు స్థానభూతమైనదిగ గాకుండగ కేవలము జ్ఞాన స్వరూపము మాత్రమే అయినచో. |
| 28) 'నానఱివు' ఎన్ఱు శొల్లవేణ్డువ్, "నానఱియానిన్ఱేనె"న్నక్కూడాతు. | | 28) 'నేను తెలివిని' అని యనవలెను కాని 'నేను తెలుసుకొను చున్నాను' అని యనుట సంభవించదు. |
| 29) జ్ఞాతా వెన్ఱపోతే, కర్తా భోక్తా వెన్నుమిడమ్ శొల్లిత్తాయిత్తు. | | 29) ఇది జ్ఞాత అని తెలిసినపుడే కర్తయు, భోక్తయు అగుచున్నదను విషయము తెలిపినటులాయెను. |
| 30) కర్తృత్వ భోక్తృత్వఙ్గళ్ జ్ఞానావస్థా విశేషఙ్గళాకైయాలే. | | 30) కర్తృత్వ - భోక్తృత్వములు జ్ఞానము యొక్క అవస్థావిశేషములే కదా. |
| 31) శిలర్ గుణఙ్గళుక్కే కర్తృత్వముళ్ళదు, ఆత్మావుక్కిల్లైయెన్ఱార్గళ్. | | 31) కొందరు 'గుణములకే కర్తృత్వము గలదు గాని ఆత్మకు లేదు' అని యనిరి. |
| 32) అప్పోదివనుక్కు శాస్త్రవశ్యతైయుమ్ భోక్తృత్వముమ్ కులైయుమ్. | | 32) అటులనినచో శాస్త్రమునకు వశుడై యుండుటయు, భోక్తయై యుండుటయు తటస్థించదు. |
| 33) సాంసారిక ప్రవృత్తిగళిల్ కర్తృత్వమ్ స్వరూప ప్రయుక్తమన్ఱు. | | 33) సాంసారిక ప్రవృత్తులలో కర్తృత్వము స్వరూపప్రయుక్తమైనదికాదు. |
| 34) గుణసంసర్గ కృతమ్. | | 34) గుణముల సంబంధము వలన తటస్థించును. |
| 35) కర్తృత్వన్దా నీశ్వరాధీనమ్. | | 35) కర్తృత్వము ఈశ్వరుని కధీనమైనది. |
| 36) జ్ఞానాశ్రయమాగిల్ శాస్త్రఙ్గళిలే యివనై జ్ఞానమెన్ఱు శొల్లువానెన్నెన్నిల్. | | 36) ఆత్మ జ్ఞానమున కాశ్రయమైన దగుచో శాస్త్రములలో దీనిని "జ్ఞానము" అని అందురేల అనగ - |
| 37) జ్ఞానత్తైయొ ఴియవుమ్ తన్నైయఱిగైయాలుమ్, జ్ఞానమ్ సారభూత గుణ | | 37) జ్ఞాననిరపేక్షముగా తనను తెలుసుకొన కలిగి యుండుట వలనను, |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| చిత్రీకరణము | |
| మాయ్ నిరూపకధర్మమాగైయాలుమ్ శొల్లిత్తు. | జ్ఞానము దీని యొక్క సారభూతమైన గుణమై, నిరూపక ధర్మమై యుండుట వలనను అటుల చెప్ప బడినది. |
| 38) నియామ్యమాగై యావదు - ఈశ్వర బుద్ధ్యధీన మాగ ఎల్లా వ్యాపారఙ్గళు ముణ్డామ్బడి యిరుక్కై. | 38) నియామ్యమైనదనగా - ఈశ్వరుని యొక్క సంకల్పమునకు లోబడి తన సమస్త వ్యాపారములను గలిగి యుండుట. |
| 39) ధార్యమాగైయావదు అవనుడైయ స్వరూపసఙ్కల్పఙ్గళై యొఴిన్దపోదు తన్ సత్తైయిల్లైయామ్బడి యిరుక్కై. | 39) ధార్యమైన దనగా - ఈశ్వరుని యొక్క స్వరూప సంకల్పములు లేనపుడు తన యొక్క ఉనికియే యుండకుండుట. |
| 40) శేషమాగైయావదు - చన్దన కుసుమ తామ్బూలాదిగళై ప్పోలే అవనుక్కిష్ట వినియోగార్హమాయిరుక్కై. | 40) శేషభూతమైనదనగా - చందనము పుష్పములు - తాంబూలములు ఇత్యాదుల వలె ఈశ్వరునికిష్ట వినియోగార్హమై యుండుట. |
| 41) ఇదుదాన్ గృహక్షేత్ర పుత్ర కళత్రాది గళైప్పోలే పృథక్స్థిత్యాది గళుక్కు యోగ్యమామ్బడి యిరుక్కైయన్ఱిక్కే శరీరమ్పోలే అవత్తుక్కు అయోగ్యమా యిరుక్కై. | 41) ఆత్మ, గృహ - క్షేత్ర - పుత్ర - కళత్రాదుల వలె ప్రత్యేకము వేరుగా యుండుట కనువైనదిగ గాకుండగ, శరీరమువలె వాటికి అననుగుణమై యుండుట. (అనగ ఈశ్వరునికి శరీరమై పృథక్ స్థితి లేకుండుట యని యర్థము.) |
| 42) ఆత్మస్వరూపన్దాన్ బద్ధముక్త నిత్య రూపేణ మూన్ఱుపడిప్పట్టిరుక్కుమ్. | 42) ఆత్మ స్వరూపము బద్ధులు - ముక్తులు - నిత్యులు అని మూడు విధములుగ నుండును. |
| 43) బద్ధరెన్గిఱదు సంసారిగళై. | 43) సంసారులను బద్ధులందురు. |

| ద్రావిడము | చిత్ప్రకరణము | ఆంధ్రము |
|---|---|---|
| 44) ముక్తరెన్గిఱదు సంసారసమ్బన్ధమత్త వరగళ్. | | 44) సంసార సంబంధము నశించిన వారలను ముక్తులందురు. |
| 45) నిత్యరెన్గిఱదు ఒరునాళుమ్ సంసరి యాద శేషశేషాశనాదిగళ్. | | 45) ఏనాడు గూడ సంసార సంబంధ మెంత మాత్రము లేనట్టి అనంత - గరుడ - విష్వక్సేనాదులను నిత్యు లందురు. |
| 46) జలత్తుక్కు అగ్ని సంసృష్ట స్థాలీసం సర్గత్తాలే ఔష్ణ్యశబ్దాది గళుణ్డాగిఱా ప్పోలే, ఆత్మావుక్కు మచిత్సమ్బన్ధ త్తాలే అవిద్యాకర్మ వాసనారుచి గళుణ్డా గిన్ఱన. | | 46) జలమునకు, అగ్నిస్పర్శగల పాత్రతో సంబంధముచే ఔష్ణ్యము - శబ్దము మున్నగునవి కలుగునటులనే ఆత్మకు అచిత్తు యొక్క సంబంధముచే అవిద్య - కర్మ - వాసన - రుచులు కలుగుచున్నవి. |
| 47) అచిత్తుక్కళ్ళి న్దవాతే అవిద్యాదిగళ్ కళ్ళి యుమెన్బర్కళ్. | | 47) అచిత్తుతో సంబంధము పోయిన వెంటనే అవిద్యాదులు పోవునందురు. |
| 48) ఇమ్మూన్ఱుమ్ తనిత్తనియే అనన్తమా యిరుక్కుమ్. | | 48) ఈ మూడును ప్రత్యేక ప్రత్యేకముగ అనంతములై యుండును. |
| 49) శిలర్-ఆత్మభేదమిల్లై, ఏకాత్మావే యుళ్ళ దెన్బార్గళ్. | | 49) కొందరు ఆత్మలనేకములు కావు ఆత్మ ఒకటి మాత్రమే యున్నదని యందురు. |
| 50) అన్దపక్షత్తిల్ ఒరువన్ సుఖిక్కిఱకాల త్తిలే వేఱేయొరువన్ దుఃఖిక్క క్కూడాదు. | | 50) అటులనగు పక్షమున - ఒకడు సుఖించు సమయములో మరొకడు దుఃఖమును జెందకూడదు. |
| 51) అదు దేహభేదత్తాలే యెన్నిల్. | | 51) అది దేహభేదము వలన తటస్థించు ననినచో. |
| 52) సౌభరిశరీర త్తిలుమదు కాణవేణుమ్. | | 52) 'సౌభరి' అనే మహర్షి శరీరము లందును అట్టిది గనుపించవలసి యుండును. |

| ద్రావిడము | చిత్రకరణము | ఆంధ్రము |
|---|---|---|
| 53) ఒరువన్ సంసరిక్కైయుమ్ ఒరువన్ ముక్త నాగైయుమ్ ఒరువన్ శిష్యనాగై యుమ్ ఒరువనాచార్య నాకైయుమ్ కూడాదు. | | 53) ఒకడు సంసారియై యుండుటయు, మరియొకడు ముక్తుడగుటయు, ఒకడు శిష్యుడగుటయు - మరియొకడు ఆచార్యుడగుటయు తటస్థించజాలదు. |
| 54) విషమసృష్టియుమ్ కూడాదు. | | 54) హెచ్చుతగ్గులుగల విషమసృష్టియు సంభవించ యుండదు. |
| 55) ఆత్మభేదమ్ శొల్లుగిఱ శ్రుతియోడుమ్ విరోధిక్కుమ్. | | 55) ఆత్మలు భిన్నములని తెలుపు శ్రుతితో విరోధము తటస్థించును. |
| 56) శ్రుతి ఔపాధికభేదత్తై చ్చొల్లుగిఱదెన్న వొణ్ణాదు. | | 56) శ్రుతి ఉపాధి వలన కలుగు భేదమును తెలుపుచున్నదన తగదు. |
| 57) మోక్షదశైయిలుమ్ భేదముణ్డాకైయాలే. | | 57) మోక్షదశలో గూడ ఆత్మలు భిన్నములయ్యే యుండునుగాన. |
| 58) అప్పోదు దేవమనుష్యాది భేదముమ్ కామక్రోధాది భేదముమ్ కఴ్రిన్దు ఆత్మాక్కళ్ స్వరూప మత్యన్తమ్ సమమాయ్ ఒరువడి యాలుమ్ భేదమ్ శొల్లవొణ్ణాదపడి యిరున్దదేయాగిలుమ్. | | 58) మోక్షదశలో దేవ - మనుష్యాది భేదమున్ను, కామ - క్రోధాది భేదమున్ను నశించి ఆత్మల యొక్క స్వరూపము పూర్తిగ సమముగ ఒకేవిధముగ నుండి ఏవిధముగను కూడ భేదమును తెలుపశక్యము గానిదై యుండును, అయినను, |
| 59) పరిమాణముమ్ ఎడైయుమ్ ఆకారము మొత్తిరుక్కిఱ పొఱ్కుడఙ్గళ్ రత్నఙ్గళ్ వ్రీహిగళ్ తొడక్కమాన వస్తుక్కు భేద ముణ్డాగిఱాప్పోలే స్వరూప భేదముమ్ సిద్ధమ్. | | 59) పరిణామము, తూనిక, ఆకారము సమముగ ఒకేవిధముగ నుండునట్టి బంగార కలశములు, రత్నములు, ధాన్యములు మున్నగు వానికి తమలో పరస్పర భేదముండు నటులనే, ఆత్మలకును స్వరూప భేదము సిద్ధమైన దగుచున్నది. |

| ద్రావిడము | చిత్రకరణము | ఆంధ్రము |
|---|---|---|
| 60) ఆకైయాలాత్మ భేదమ్ కొళ్ళవేణుమ్. | | 60) గాన ఆత్మలు భిన్నములని గ్రహించ వలయును. |
| 61) ఇప్పోదివర్గళుక్కు లక్షణమ్ - శేషత్వత్తోడేకూడిన జ్ఞాతృత్వమ్. | | 61) ఇప్పుడు ఆత్మల యొక్క లక్షణ మేమనగా - శేషత్వముతో గూడిన జ్ఞాతృత్వము. |
| 62) ఇవర్గళుడైయ జ్ఞానన్దాన్ స్వరూప మ్పోలే నిత్య ద్రవ్యమాయ్ అజడ మాయ్ ఆనన్దరూపమా యిరుక్కుమ్. | | 62) వీని జ్ఞానము, వీని స్వరూపమువలెనే నిత్యద్రవ్యమై, అజడమై, ఆనందరూపమై యుండును. |
| 63) ఆనాల్, జ్ఞానత్తుక్కుమ్ స్వరూపత్తుక్కుమ్ వాశియెన్నెన్నిల్. | | 63) అయినచో జ్ఞానమునకును, స్వరూపమునకును భేదమేమి యన్నచో - |
| 64) స్వరూపమ్ ధర్మియాయ్ సఙ్కోచవికాసఙ్గళుక్కు అయోగ్యమాయ్ తన్నైయొఴిన్ద వత్తై ప్రకాశిప్పియామలే తనక్కుత్తాన్ ప్రకాశిక్కక్కడవదాయ్ అణువా యిరుక్కుమ్. జ్ఞానమ్ ధర్మమాయ్ సఙ్కోచ వికాసఙ్గళుక్కు యోగ్యమాయ్ తన్నై యొఴిన్ద వత్తై ప్రకాశిప్పిక్క క్కడవదాయ్ తనక్కుత్తాన్ ప్రకాశియాదే ఆత్మావుక్కు ప్రకాశిక్కక్కడవదాయ్ విభువా యిరుక్కుమ్. | | 64) స్వరూపము - ధర్మియై సంకోచ వికాసములు లేనిదై, తనకంటె నితరములైన వాటిని ప్రకాశింప జేయుజాలనిదై, తనకు తాను ప్రకాశించగలదై, అణువై యుండును, జ్ఞానము ధర్మమై, సంకోచవికాసములకు తగినదై, తనకంటె భిన్నమైన వాటిని ప్రకాశింప జేయగలదై, తనకు తాను ప్రకాశింపక ఆత్మకు ప్రకాశించగలదై, విభువై యుండును. |
| 65) అదిల్ శిలరుడైయ జ్ఞానమ్ ఎప్పోదుమ్ విభువాయిరుక్కుమ్, శిలరుడైయ జ్ఞానమ్ ఎప్పోదుమ్ అవిభువా యిరుక్కుమ్, శిలరుడైయ జ్ఞానమ్ ఒరుక్కాల్ విభువాయ్ ఒరుక్కాల్ అవిభువా యిరుక్కుమ్. | | 65) అందు, కొంతమందియొక్క జ్ఞానము ఎపుడునుకూడ విభువై యుండును - కొందరి జ్ఞానము ఎపుడును అవిభువై యుండును, కొందరి జ్ఞానము ఒకప్పుడు విభువై, మరొకప్పుడు అవిభువై యుండును. |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| చిత్రకరణము | |
| 66) జ్ఞానమ్ నిత్యమాగిల్ 'ఎనక్కు జ్ఞానమ్ పిఱన్దదునశిత్తదు' ఎన్గిఅపడి యెన్నెన్నిల్. | 66) జ్ఞానము నిత్యమైనదగుచో "నాకు జ్ఞానము కలిగినది - నశించినది" అనియనుట ఎటులననగ - |
| 67) ఇన్ద్రియ ద్వారా ప్రసరిత్తు విషయఙ్గళై గ్రహిప్పదుమ్ మీళువదుమాకైయాలే అప్పడి శొల్లక్కుఱైయిల్లై. | 67) ఇంద్రియముల ద్వారా ప్రసరించి విషయములను గ్రహించుట. మరలిపోవుట అను దానినిబట్టి అటులనుటలో అభ్యంతరమేమియు లేదు. |
| 68) ఇదుతాన్ ఏకమా యిరుక్కచ్చెయ్దే నానావాయ్ త్తోత్తుగిఱదు ప్రసరణ భేదత్తాలే. | 68) ఇది ఒకటేయైం యున్నను, అనేకములుగ తోచునది ప్రసరణమందలి భేదముల వలన. |
| 69) ద్రవ్యమానపడి యెన్నెన్నిల్. | 69) ద్రవ్యమెటుల నగుచున్నదనగ - |
| 70) క్రియాగుణఙ్గళుక్కాశ్రయమాయ్ అజడమాయిరుక్కైయాలే ద్రవ్యమాగక్కడవదు. | 70) క్రియా - గుణములకు ఆశ్రయమైనదై, అజడమైనదై యుండుట వలన ద్రవ్యమగు చున్నది. |
| 71) అజడమాగిల్ సుషుప్తిమూర్ఛాదిగళిల్ తోత్తవేణ్డావో వెన్నిల్. | 71) అజడమైనచో సుషుప్తి - మూర్ఛాది అవస్థలలో కనుపించవలదా యనినచో |
| 72) ప్రసరణమిల్లామైయాలే తోత్తాదు. | 72) ప్రసరణము లేకుండుటచే కనుపించదు. |
| 73) ఆనన్దరూపమాకై యావదు - జ్ఞానమ్ ప్రకాశిక్కుమ్పోదు అనుకూలమాయిరుక్కై. | 73) ఆనందరూపమైనదనగా - జ్ఞానము ప్రకాశించునపుడు అనుకూలమైనదై యుండుట. |
| 74) విషశస్త్రాదిగళై క్కాట్టుమ్పోదు ప్రతికూలమా యిరుక్కైక్కడి దేహాత్మభ్రమాదిగళ్. | 74) విషము - శస్త్రము మున్నగు వాటిని జూపించునపుడు ప్రతికూలమై యుండుటకు కారణము దేహమే - ఆత్మ యనుభ్రమాదులు. |

| ద్రావిడము | చిత్రకరణము | ఆంధ్రము |
|---|---|---|

75) ఈశ్వరాత్మకమాకైయాలే యెల్లా పదార్థజ్గళుక్కు మానుకూల్యమే స్వభావమ్, ప్రాతికూల్యమ్ వన్దేతి.

76) మత్తై యానుకూల్యమ్ స్వాభావిక మాగిల్ ఒరువనుక్కొరుక్కాలో రిడత్తిలే అనుకూలజ్గళాన చన్దన - కుసుమాదిగళ్ దేశాన్తరే కాలాన్తరే ఇవన్ తనక్కుమ్, అద్దేశత్తిలే అక్కాలత్తిలే వేఱెయొరువనుక్కుమ్ ప్రతికూలజ్గళాగక్కూడాదు.

చిత్రకరణమ్ ముత్తిత్తు
పిళ్ళైలోకాచార్యర్ తిరువడిగళే శరణమ్
జీయర్ తిరువడిగళే శరణమ్



75) ఈశ్వరుని తనకు ఆత్మగా గలదై యుండుటచే అన్ని పదార్థములకును అనుకూలమైయుండుటే స్వభావము ప్రతికూలమైయుండుట ఆరోపితము

76) మిగిలిన యానుకూల్యములు స్వాభావిక మనినచో ఒకనికి ఒక కాలములో ఒక స్థలమున అను కూలములైన చందన-కుసుమాదులు దేశాంతరమున, కాలాంతరమున వానికేగాని, లేక ఆ దేశముననే, ఆ కాలముననే మరియొకనికి గాని ప్రతికూలములు కాగూడదు.

చిత్రకరణము ముగిసినది
పిళ్ళైలోకాచార్యర్ తిరువడిగళే శరణము



| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| **అచిత్ప్రకరణము** | |
| 77) అచిత్తు జ్ఞానశూన్యమాయ్ వికారాస్పద మాయిరుక్కుమ్. | 77) అచిత్తు జ్ఞానశూన్యమైనదై, వికారాస్పదమైనదై యుండును. |
| 78) ఇదు శుద్ధసత్త్వ మెన్నుమ్ మిశ్ర సత్త్వ మెన్నుమ్ సత్త్వశూన్య మెన్నుమ్ త్రివిధమ్. | 78) ఇది శుద్ధసత్త్వమును - మిశ్రసత్త్వము - సత్త్వశూన్యము అని మూడు విధములుగ నుండును. |
| 79) ఇదిల్ శుద్ధ సత్త్వమావదు - రజస్తమస్సుక్కళ్ కలశాదే కేవల సత్త్వమాయ్ నిత్యమాయ్ జ్ఞానానన్ద జనకమాయ్ కర్మత్తాలన్రిక్కే కేవల భగవదిచ్ఛైయాలే విమాన గోపుర మణ్డప ప్రాసాదాది రూపేణ పరిణమిక్కక్కడవదాయ్ నిరవధిక తేజో రూపమాయ్ నిత్యముక్తరాలు మీశ్వర నాలుమ్ పరిచ్ఛేదిక్కవరిదాయ్ అత్యద్భుతమాయిరుప్పదొన్ను. | 79) ఇందు శుద్ధసత్త్వమనగా - రజస్తమస్సుల కలుపు లేకుండగ కేవలము సత్త్వరూపమై నిత్యమై జ్ఞానానంద జనకమై కర్మ వలన గాకుండగ కేవలము భగవదిచ్ఛ వలననే విమాన-గోపుర - మండవ - భవనాది రూపములుగ పరిణమించజాలినదై నిరవధిక తేజోరూపమై నిత్య - ముక్తులచే గాని ఈశ్వరునిచేగాని పరిచ్ఛేదించుటకు శక్యముగానిదై అత్యద్భుతమై యుండునట్టిది. |
| 80) ఇత్తైశిలర్ జడమెన్బార్గళ్ శిలర్ అజడ మెన్బార్గళ్. | 80) దీనిని కొందరు జడమనిరి, కొందరు అజడమనిరి. |
| 81) అజడమానపోదు నిత్యర్క్కుమ్ ముక్తర్క్కుమ్ ఈశ్వరనుక్కుమ్ జ్ఞానత్తై యొఴియవుమ్ తోత్తుమ్. | 81) అజడమైనపుడు నిత్యులకును, ముక్తులకును, ఈశ్వరునికిని జ్ఞానసహాయము లేకుండగనే భాసించును. |
| 82) సంసారిగళుక్కుత్తోత్తాదు. | 82) సంసాలకు భాసించదు. |
| 83) ఆత్మావిలుమ్ జ్ఞానత్తిలుమ్ భిన్నమాన పడియెన్నెన్నిల్. | 83) ఆత్మ కంటెను, జ్ఞానము కంటెను భిన్నమెటుల నైనదనగా - |
| 84) నానెన్ను తోత్తామైయాలుమ్, | 84) 'నేను' అని భాసించక పోవుటవలన, |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| అచిత్ప్రకరణము | |
| శరీరఙ్గళాయ్ పరిణమిక్కైయాలుమ్ విషయఙ్గళై యొఴియవుమ్ తానే తోత్తుగై యాలుమ్ శబ్దస్పర్శా దిగళ్ ఉణ్డాగై యాలుమ్ భిన్నమాగ క్కడవదు. | శరీరములై పరిణమించుట వలనను, విషయములు లేకుండగ స్వయము గనే భాసించుట వలనను, శబ్ద స్పర్శాదులు కలిగియుండుట వలనను వేరైనదని యనవచ్చును. |
| 85) మిశ్రసత్త్వమావదు - సత్త్వరజస్త మస్సుక్కళ్ మూన్ఱుడుమ్ కూడి బద్ధచేత నరుడైయ జ్ఞానానన్దఙ్గళుక్కు తిరోధాయకమాయ్, విపరీత జ్ఞానజనకమాయ్, నిత్యమాయ్, ఈశ్వరనుక్కు క్రీడాపరికరమాయ్, ప్రదేశ భేదత్తాలుమ్ కాలభేదత్తాలుమ్ సదృశమాయుమ్ విసదృశమాయు మిరుక్కుమ్ వికారఙ్గళై యుణ్డాక్క క్కడవదాయ్, ప్రకృతి అవిద్యై మాయై యెన్గిఱ పేర్ గళైయుడైత్తా యిరుక్కు మచిద్వి శేషమ్. | 85) మిశ్రసత్త్వమనగా - సత్త్వ - రజ - స్తమస్సులు మూడింటితోను కూడుకున్నదై బద్ధచేతనుల యొక్క జ్ఞానానందములకు తిరోధాయకమై విపరీజ్ఞానజనకమై, నిత్యమై ఈశ్వరునికి క్రీడాపరికరమై, ప్రదేశ భేదము చేతను కాలభేదముచేతను సదృశమైనట్టియు, విసదృశమై నట్టియు, వికారములను కలిగింప జాలినదై ప్రకృతియనియు - అవిద్యయనియు - మాయ అనియు నామములను కలిగియున్న అచిద్విశేషము. |
| 86) ప్రకృతి యెన్గిఱదు - వికారఙ్గళై ప్పిఱప్పిక్కైయాలే, అవిద్యై యెన్గిఱదు జ్ఞాన విరోధియాగైయాలే, మాయై యెన్గిఱదు - విచిత్రసృష్టియై ప్పణ్ణుగైయాలే. | 86) వికారములను జనింపజేయున దగుటవలన ప్రకృతి యనబడు చున్నది. జ్ఞానవిరోధి యగుటవలన అవిద్య యనబడుచున్నది. విచిత్ర మైన సృష్టిని జేయుటవలన మాయ యనబడుచున్నది. |
| 87) ఇదుతాన్ "పొంగుణమ్బులనుమ్, పొఱియైన్దుమ్, కరుమేన్దిరియమ్, మైమ్బూదమ్ ఇఙ్గివ్వుయిరేయ్ పిరకిరుది, మానాఙ్గార మనఙ్గళ్" | 87) ఇది "పొంగైంబులనుం పొఱియైందుం కరుమేందిరియ మైంబూదం ఇంగివ్వుయిరేయ్ పిరకిరుది మానాంగార మనంగళ్" |

అచిత్ప్రకరణము

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| ఎన్గిఱపడియే ఇరువత్తి నాలుతత్త్వమా యిరుక్కుమ్. | (పంచతన్మాత్రలు పంచజ్ఞానేంద్రియములు పంచమహాభూతములు ప్రకృతి, బుద్ధి, అహంకార, మనస్సులు) అనునటుల ఇరువది నాలుగు తత్త్వములుగనుండును. |
| 88) ఇదిల్ ప్రథమతత్త్వమ్ ప్రకృతి. | 88) ఇందు మొదటితత్త్వము ప్రకృతి. |
| 89) ఇదు అవిభక్తతమస్సెన్నుమ్, విభక్త తమస్సెన్నుమ్, అక్షరమెన్నుమ్ శిల అవస్థైగళై యుడైత్తా యిరుక్కుమ్. | 89) ఇది అవిభక్త తమస్సనియు, విభక్త తమస్సనియు, అక్షరమనియు కొన్ని యవస్థలను గలదై యుండును. |
| 90) ఇదిల్ నిన్నుమ్ గుణవైషమ్యత్తాలే మహదాదివికారఙ్గళ్ పిఱక్కుమ్. | 90) దీనినుండి గుణవైషమ్యము వలన మహదాది వికారములు జనించును. |
| 91) గుణఙ్గళాగిఱన సత్త్వరజస్తమస్సుక్కళ్. | 91) గుణములనగా సత్వ - రజ - స్తమస్సులు. |
| 92) ఇవై ప్రకృతిక్కు స్వరూపానుబన్ధిగళాన స్వభావఙ్గళాయ్ ప్రకృత్యవస్థైయిల్ అనుద్భూతఙ్గళాయ్ వికారదశైయిల్ ఉద్భూతఙ్గళా యిరుక్కుమ్. | 92) ఇవి ప్రకృతికి స్వరూపానుబంధములైన స్వభావములై, ప్రకృతి యవస్థయందు అనుద్భూతములై వికారదశయందు ఉద్భూతములై యుండును. |
| 93) సత్త్వమ్ జ్ఞానసుఖఙ్గళైయుమ్ ఉభయ సఙ్గత్తైయుమ్ పిఱప్పిక్కుమ్. | 93) సత్త్వము - జ్ఞానమును, సుఖమును ఈ రెండింటితో సంగమమును కలిగింప జేయును. |
| 94) రజస్సు రాగతృష్ణా సఙ్గఙ్గళైయుమ్ కర్మ సఙ్గత్తైయుమ్ పిఱప్పిక్కుమ్. | 94) రజస్సు రాగము - తృష్ణ వీనితో సంగమమును కర్మతో సంగమమును కలిగింపజేయును. |
| 95) తమస్సు విపరీతజ్ఞానత్తైయుమ్ అనవధానత్తైయుమ్ ఆలస్యత్తైయుమ్ నిద్రైయైయుమ్ పిఱప్పిక్కుమ్. | 95) తమస్సు - విపరీతజ్ఞానమును, ప్రమాదమును (పరాకును) ఆలస్యమును (అలసత్వమును), నిద్రను కలిగింప జేయును. |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| అచిత్ప్రకరణము | |
| 96) ఇవై సమఙ్గళానపోదు వికారఙ్గళ్ సమఙ్గళు మాయ్ అస్పష్టఙ్గళు మాయిరుక్కుమ్, విషమఙ్గళానపోదు వికారఙ్గళ్ విషమఙ్గళు మాయ్ స్పష్టఙ్గళు మాయిరుక్కుమ్. | 96) ఈ గుణములు సమముగా నున్నపుడు వికారములు సమములై అస్పష్టములై యుండును. ఇవి విషమములై యున్నపుడు వికారములు విషమములై స్పష్టములై యుండును. |
| 97) విషమ వికారఙ్గళిల్ ప్రథమ వికారమ్ మహాన్. | 97) విషమ వికారములలో మొదటి వికారము మహత్తత్త్వము. |
| 98) ఇదు సాత్త్వికమ్, రాజసమ్, తామస మెన్ఱు త్రివిధమాయ్ అధ్యవసాయ జనకమా యిరుక్కుమ్. | 98) ఇది సాత్త్వికము - రాజసము - తామసము అని మూడు విధములై అధ్యవసాయమును జనింప జేయునదై యుండును. |
| 99) ఇదిల్‌నిన్ఱుమ్ వైకారికమ్, తైజసమ్, భూతాదియెన్ఱు, త్రివిధమాన అహఙ్కారమ్ పిఱక్కుమ్. | 99) దీనినుండి వైకారికము, తైజసము, భూతాది అను మూడువిధములైన అహంకారములు జనించును. |
| 100) అహఙ్కార మభిమాన హేతువా యిరుక్కుమ్. | 100) అహంకారము అభిమానమునకు హేతువై యుండును. |
| 101) ఇదిల్ వైకారికత్తిల్ నిన్ఱుమ్ శ్రోత్రత్వ క్చక్షుర్జిహ్వా ఘ్రాణఙ్గళెన్గిఱ జ్ఞానేన్ద్రియ ఙ్గళైన్దుమ్, వాక్పాణిపాదపాయూపస్థఙ్గ ళెన్గిఱ కర్మేన్ద్రియఙ్గళైన్దుమ్, మనస్సు మాగిఱ పదినో రిన్ద్రియఙ్గళుమ్ పిఱక్కుమ్. | 101) ఇందు వైకారికాహంకారమును శ్రోత్ర త్వక్ - చక్షు - ర్జిహ్వా ఘ్రాణములను జ్ఞానేంద్రియము లైదును, వాక్ - పాణి - పాదపాయు - ఉపస్థములను కర్మేంద్రియము లైదును, మనస్సును మొత్తము పదునొకండు ఇంద్రియ ములును జనించును. |
| 102) భూతాదియిల్ నిన్ఱుమ్ శబ్దతన్మాత్రై పిఱక్కుమ్. ఇదిల్ నిన్ఱుమ్ ఆకాశ | 102) భూతాద్యహంకారమునుండి శబ్ద తన్మాత్ర జనించును. దీనినుండి |

| ద్రావిడము | ఆంధ్రము |
| --- | --- |
| ముమ్ స్పర్శ తన్మాత్త్రైయుమ్ పిఱక్కుమ్, ఇదిల్ నిన్ఱుమ్ వాయువుమ్ రూపతన్మాత్త్రైయుమ్ పిఱక్కుమ్, ఇదిల్ నిన్ఱుమ్ తేజస్సుమ్ రస తన్మాత్త్రైయుమ్ పిఱక్కుమ్, ఇదిల్ నిన్ఱుమ్ అప్పుమ్ గన్ధతన్మాత్త్రైయుమ్ పిఱక్కుమ్ ఇదిల్ నిన్ఱుమ్ పృథివి పిఱక్కుమ్. | ఆకాశమున్ను, స్పర్శ తన్మాత్ర యున్ను జనించును. దీనినుండి వాయువున్ను, రూపతన్మాత్రయున్ను జనించును. దీనినుండి తేజస్సున్ను, రస తన్మాత్రయున్ను జనించును. దీని నుండి జలమున్ను గంధ తన్మాత్రయున్ను జనించును. దీని నుండి పృథివి జనించును. |
| 103) స్పర్శ తన్మాత్త్రై తుడక్కమాన నాలుతన్మాత్త్రైగళుమ్, ఆకాశమ్ తుడక్కమాననాలుం భూతఙ్గళుక్కుమ్ కార్యమాయ్, వాయు తుడక్కమాన నాలుభూతఙ్గళుక్కు క్కారణమాయిరుక్కుమెన్ఱుమ్ శొల్లువర్కళ్. | 103) స్పర్శతన్మాత్ర మొదలుగా గల నాలుగు తన్మాత్రలును, ఆకాశము మొదలుగాగల నాలుగు భూతములకు కార్యస్వరూపములై, వాయువు మొదలుగాగల నాలుగు భూతములకు కారణములై యుండుననియు తెలుపుదురు. |
| 104) తన్మాత్రఙ్గళావన - భూతఙ్గళినుడైయ సూక్ష్మావస్థైకళ్. | 104) తన్మాత్రలనగా భూతముల యొక్క సూక్ష్మావస్థలు. |
| 105) మత్తైయిరణ్డహఙ్కారముమ్ స్వకార్యఙ్గళై ప్పిఱప్పిక్కుమ్పోదు రాజసాహఙ్కారమ్ సహకారియా యిరుక్కుమ్. | 105) మిగిలిన రెండు అహంకారములును తమ కార్యములను కలిగించునపుడు రాజసాహంకారము వానికి సహకారియై యుండును. |
| 106) సాత్త్వికాహఙ్కారమ్ శబ్ద, తన్మాత్రాది పఞ్చకత్తైయుమ్ అడైవే సహకారియాయ్ క్కొణ్డు శ్రోత్రాది జ్ఞానేన్ద్రియఙ్గళై న్దైయుమ్ సృష్టిక్కుమ్, తత్సహకృత మాయ్క్కొణ్డు వాగాది కర్మేన్ద్రియఙ్గళై న్దైయుమ్ సృష్టిక్కుమ్, ఇవత్తైయొక్కి యత్తానే మనస్సై | 106) సాత్త్వికాహంకారము శబ్ద, తన్మాత్రాది పంచకమును క్రమముగా సహకారిగ తీసుకొని శ్రోత్రాది జ్ఞానేంద్రియముల నైదింటిని సృజించును. వానిని సహకారులుగ దీసికొని వాగాది కర్మేంద్రియముల నైదింటిని సృజించును. వీనియొక్క సహకార |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| సృష్టిక్కు మెన్ఱు శొల్లువర్ గళ్. | మేమియు లేకుండగ స్వయముగనే మనన్పును సృజించును అని చెప్పుదురు. |
| 107) శిలర్ ఇన్ద్రియఙ్గళిలే శిలవత్తై భూత కార్య మెన్ఱార్గళ్. | 107) కొందరు ఇంద్రియములలో కొన్నింటిని భూతకార్యములనిరి. |
| 108) అదుశాస్త్ర విరుద్ధమ్. | 108) అది శాస్త్ర విరుద్ధము. |
| 109) భూతఙ్గళ్ ఆప్యాయకఙ్గళిత్తనై. | 109) భూతములు ఆప్యాయకములు మాత్రమే. |
| 110) ఇవై కూడినాలల్లదు కార్యకరమల్లామై యాలే, మణ్ణైయుమ్ మణలైయుమ్ నీరైయుమ్ శేర్త్తు, ఒరుద్రవ్య మాక్కి చ్చువరిడు వారైప్పోలే ఈశ్వరన్ ఇవత్తై యెల్లామ్ తన్నిలేశేర్త్తు ఓరణ్డమాక్కి అదుక్కుళ్ళే చతుర్ముఖనై సృష్టిత్త రుళుమ్. | 110) ఇవి కూడిననేతప్ప, కార్యకారి గాకుండుట వలన, మట్టిని, యిసుకను, నీటిని చేర్చి ఒక ముద్దగ జేసి, గోడను బెట్టువారి వలెనే ఈశ్వరుడు వీటినన్నిటిని తన యందుజేర్చి ఒక అండముగ జేసి అందు చతుర్ముఖుని సృజించి కటాక్షించును. |
| 111) అణ్డత్తైయుమ్ అణ్డకారణఙ్గళైయుమ్ తానే యుణ్డాక్కుమ్, అణ్డత్తు క్కుళ్ళట్ట వస్తుక్కళై చేతనర్క్కు అన్తర్యామి యాయ్ నిన్ఱు ఉణ్డాక్కుమ్. | 111) అండమును, అండమునకు కారణములైన వానిని తానే సృజించును. అండము లోపల గల వస్తువులను చేతనులకు అంతర్యామియై యుండి సృజించును. |
| 112) అణ్డఙ్గళ్తాన్ అనేకఙ్గళాయ్, పదినాలు లోకఙ్గళోడేకూడి ఒన్ఱుక్కొన్ఱు పదిత్తు మడఙ్గాన ఏళావరణఙ్గళాలుమ్ శూழప్పట్టు, ఈశ్వరనుక్కు క్రీడాకన్దు కస్థానీయఙ్గళాయ్, జలబుద్బుదమ్పోలే ఏకకాలత్తిలే సృష్టఙ్గళా యిరుక్కుమ్. | 112) అండములు అనేకములై, పదు నాలుగు లోకములతోకూడి ఒకదాని కంటె మరొకటి పదేసిరెట్లు చొప్పున విస్తారమైన ఏడు ఆవరణములచే చుట్టపెట్టబడి, ఈశ్వరునికి ఆట బంతి వంటివై, నీటిబుడగలవలె |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| | ఏకకాలమున సృజింపబడినవై యుండును. |
| 113) భూతఙ్గళిల్ ఆకాశమ్ అవకాశహేతు, వాయు వహనాదిహేతు, తేజస్సు పచనాది హేతు, జలమ్ సేచన పిణ్డీకరణాది హేతు, పృథివి ధారణాదిహేతు వెన్బర్గళ్. | 113) భూతములలో ఆకాశము అవకాశ మును కలిగించుటకు హేతువైనది, వాయువు వహించుటకు హేతు వైనది, తేజస్సు వచనాదులకు హేతువైనది జలము తడుపుటకును, ముద్దగజేయుట మున్నగు వాటికిని హేతువైనది. పృథివి ధారణాదులకు హేతువైనది యని యందురు. |
| 114) శ్రోత్రాదిజ్ఞానేన్ద్రియఙ్గళ్ ఐన్దుక్కుమ్ అడైవే శబ్దాదిగళ్ ఐన్దైయుమ్ గ్రహిక్కై తొழిల్. వాగాదికర్మేన్ద్రి యఙ్గళైన్దు క్కుమ్ విసర్గ శిల్పగత్యుక్తిగళ్ తొழిల్, మనస్సు ఇవై యిత్తనైక్కుమ్‌పొదు. | 114) శ్రోత్రాది జ్ఞానేంద్రియము లైదింటి కిని క్రమముగా శబ్దాదుల నైదింటిని గ్రహించుట స్వభావము. వాగాది కర్మేంద్రియము లైదింటికిని విడుచుట, శిల్పము, గమనము, భాషించుట అనునవి కృత్యములు, మనస్సు వీనికన్నింటికిని పొదువైనదై యుండును. |
| 115) ఆకాశాది భూతఙ్గళుక్కు అడైవే శబ్దాదిగళ్, గుణఙ్గళా యిరుక్కుమ్. | 115) ఆకాశాది భూతములకు క్రమముగా శబ్దాదులు గుణములై యుండును. |
| 116) గుణవినిమయమ్ పఞ్చీకరణత్తాలే. | 116) గుణములయొక్క సాంకర్యము పంచీకరణముచే కలుగును. |
| 117) ఆకాశమ్ కఱుత్తుత్తోన్ఱుగిఱదు మత్తాలే. | 117) ఆకాశము నీలముగా కనుపించు టయు పంచీకరణము వలననే. |
| 118) మున్బుత్తై తన్మాత్రైగళోడే కూడిక్కొణ్డు ఉత్తరోత్తర తన్మాత్రైగళ్ స్వవిశేషఙ్గళై ప్పిఱప్పిక్కైయాలే గుణాధిక్య ముణ్డాయి త్తెన్ఱుమ్ శొల్లువర్‌కళ్. | 118) ముందరనున్నట్టి తన్మాత్రలతో కూడుకొని ఉత్తరోత్తర తన్మాత్రలు తమ తమ విశేషములను జనింప జేయుట వలన గుణాధిక్యము కలుగుచున్నదనియు చెప్పుదురు. |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| | **అచిత్ప్రకరణము** |
| 119) సత్త్వశూన్యమావదు కాలమ్. | 119) సత్త్వశూన్యమనగా కాలము. |
| 120) ఇదు ప్రకృతి ప్రాకృతఙ్గళినుడైయ వరిణామఙ్గళుక్కు హేతువాయ్, కలాకాష్ఠాది రూపేణ పరిణమిక్కక్కడవదాయ్, నిత్యమాయ్, ఈశ్వరనుక్కు క్రీడాపరికరమాయ్, శరీరభూతమా యిరుక్కుమ్. | 120) ఇది ప్రకృతి యొక్కయు ప్రాకృతముల యొక్కయు పరిణామములకు కారణమైనదై, కలా కాష్ఠా ఇత్యాది రూపేణ పరిణమించునదై, నిత్యమైనదై, ఈశ్వరునికి క్రీడా పరికరమై, శరీరభూతమునై యుండును. |
| 121) మత్తైయిరణ్డు చిత్తుమ్ ఈశ్వరనుక్కుమ్ ఆత్మావుక్కుమ్ భోగ్య భోగోపకరణ భోగ స్థానఙ్గళా యిరుక్కుమ్. | 121) మిగిలిన రెండు అచిత్తులును ఈశ్వరునికిని ఆత్మకును భోగ్యము, భోగోపకరణము, భోగస్థానమునై యుండును. |
| 122) భోగ్యఙ్గళాగిఱవ విషయఙ్గళ్, భోగోపకరణఙ్గళాగిఱవ - చక్షురాదికరణఙ్గళ్, భోగస్థానఙ్గళాగిఱవ - చతుర్దశ భువనముమ్ సమస్తదేహముమ్. | 122) భోగ్యములనగా విషయములు, భోగోపకరణము లనగా చక్షురాది ఇంద్రియములు, భోగస్థానములనగా చతుర్దశ భువనములును, సమస్త దేహములున్ను. |
| 123) ఇదిల్ ముఱ్పట్టవచిత్తుక్కు క్కీళెల్లై యుణ్డాయ్, శుత్తుమ్ మేలుమెల్లై యిన్ఱిక్కే యిరుక్కుమ్, నడువిల చిత్తుక్కు శుత్తుమ్ కీళుమెల్లైయిన్ఱిక్కే మేలెల్లై యుణ్డా యిరుక్కుమ్, కాలమెఙ్గుమొక్క వుణ్డా యిరుక్కుమ్. | 123) ఇందు మొదటి అచిత్తగు శుద్ధసత్త్వమునకు క్రింది హద్దుండును. చుట్టును, పైనను హద్దు లేకుండును. మధ్యాచిత్తగు మిశ్రసత్త్వమునకు చుట్టును క్రిందను హద్దుండదు. మీద హద్దుండును, కాలము అంతటను ఒకేరీతిగ నుండును. |
| 124) కాలన్దాన్ పరమపదత్తిల్ నిత్యమ్, ఇఙ్గు అనిత్యమెన్ఱుమ్ శొల్లువర్గళ్. | 124) కాలము పరమపదమున నిత్యము, ఇచ్చట అనిత్యము అనియు చెప్పెదరు. |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| అచిత్ప్రకరణము | |
| 125) శిలర్ కాలత్తై యిల్లై యెన్బార్గళ్. | 125) కొందరు కాలమనునదియే లేదందురు. |
| 126) ప్రత్యక్షత్తాలు మాగమత్తాలుమ్ సిద్ధిక్కై యాలే అదు శొల్లవొణ్ణాదు. | 126) ప్రత్యక్ష ప్రమాణము వలనను, ఆగమ ప్రమాణము వలనను కాలము సిద్ధించు చుండుట వలన అటుల చెప్పగూడదు. |
| 127) పలరుమ్ దిక్కెన్ఱు తనియే ఒరు ద్రవ్య ముణ్డెన్బార్గళ్. | 127) కొందరు దిక్కు అని ప్రత్యేకము ఒక ద్రవ్యము గలదందురు. |
| 128) పలహేతుక్కళాలుమ్ ఆకాశాదిగళిలే అన్తర్భూతమాగైయాలే అదువుమ్ శేరాదు. | 128) అనేక హేతువుల వలన ఆకాశాదుల యందు అంతర్భూత మగుట వలన అటులనగూడదు. |
| 129) శిలర్ ఆవరణాభావమ్ ఆకాశమెన్బార్ గళ్. | 129) కొందరు ఆవరణాభావమే ఆకాశ మనిరి. |
| 130) భావరూపేణ తోత్తుగైయాలే అదువుమ్ శేరాదు. | 130) భావరూపముగ కనుపించు చుండుట అటులనన జెల్లదు. |
| 131) వేఱేశిలర్ ఇదుతన్నై నిత్యమ్, నిరవ యవమ్, విభు, అప్రత్యక్ష మెన్బార్గళ్. | 131) మరికొందరు దీనిని నిత్యము, నిరవయువము, విభువు, అప్రత్యక్షము యనిరి. |
| 132) భూతాదియిలే పిఱక్కైయాలుమ్, అహఙ్కారాదిగళి లిల్లామైయాలుమ్, కణ్ణుక్కు విషయమాగైయాలుమ్ అవైనాలుమ్ శేరాదు. | 132) భూతాదియందు జనించుట వలనను, అహంకారాదులయందు లేకుండుట వలనను, కంటికి కనుపించుచున్న దగుటవలనను పైన తెలిపిన నాలుగు విశేషణములు దీనికి తగవు. |
| 133) త్వగిన్ద్రియత్తాలేతోత్తుగైయాలే వాయు అప్రత్యక్షమెన్గిఱ వదువుమ్ శేరాదు. | 133) త్వగింద్రియము వలన గ్రహించబడు చున్నదగుట వలన వాయువు అప్రత్యక్షమైనదని యనుటయు తగదు. |

| ద్రావిడము | అచిత్ప్రకరణము | ఆంధ్రము |
|---|---|---|
| 134) తేజస్సు భౌమాదిభేదత్తాలే బహు విధమ్. | | 134) తేజస్సు - భౌమము, ఇత్యాది భేదములచే అనేక విధములై యుండును. |
| 135) అదిల్ ఆదిత్యాది తేజస్సు స్థిరమ్, దీపాది తేజస్సు అస్థిరమ్ | | 135) అందు సూర్యుడు మున్నగువారి తేజస్సు స్థిరమైనది. దీపాదుల యొక్క తేజస్సు అస్థిరమైనది. |
| 136) తేజస్సుక్కు నిఱమ్ శివప్పు, స్పర్శ మౌష్ణ్యమ్. | | 136) తేజస్సు యొక్క రంగు ఎఱుపు, స్పర్శము ఔష్ణ్యము. |
| 137) జలత్తుక్కు నిఱమ్ వెళుప్పు, స్పర్శ మౌష్ణ్యమ్, రసమ్ మాధుర్యమ్. | | 137) జలము యొక్క రంగు తెలుపు, స్పర్శము శైత్యము, రసము మాధుర్యము. |
| 138) భూమిక్కు నిఱముమ్, రసముమ్ బహు విధమ్. | | 138) భూమి యొక్క రంగు, రసము అనేక విధములై యుండును. |
| 139) స్పర్శమ్ ఇదుక్కుమ్, వాయువుక్కు మనుష్ణాశీతమ్. | | 139) స్పర్శము దీనికిని వాయువునకును అనుష్ణాశీతము. |
| 140) ఇప్పడి అచిత్తు మూన్నుపడిప్పట్టిరుక్కుమ్. | | 140) ఈ విధముగ అచిత్తు మూడు విధములుగ నుండును. |

అచిత్ప్రకరణమ్ ముత్తిత్తు
పిళ్ళైలోకాచార్యర్ తిరువడిగళే శరణమ్
జీయర్ తిరువడిగళే శరణమ్.



అచిత్ప్రకరణము ముగిసినది
పిళ్ళైలోకాచార్యర్ తిరువడిగళే శరణము



| ద్రావిడము | ఈశ్వర ప్రకరణము | ఆంధ్రము |
|---|---|---|
| 141) ఈశ్వరన్ అఖిల హేయప్రత్యనీ కానన్త జ్ఞానానన్దైక స్వరూపనాయ్, జ్ఞానశక్త్యాది కల్యాణగుణగణ భూషితనాయ్, సకల జగత్సర్గస్థితి సంహారకర్తానాయ్, 'ఆర్తో జిజ్ఞాసురర్థార్థీజ్ఞానీ' ఎన్గిఱ చతుర్విధ పురుషర్ గళుక్కుమాశ్రయణీయ నాయ్, ధర్మార్థకామమోక్షాఖ్య చతుర్విధ ఫలప్రదనాయ్, విలక్షణ విగ్రహ యుక్తనాయ్, లక్ష్మీ భూమీ నీళానాయకనా యిరుక్కుమ్. | | 141) ఈశ్వరుడు అఖిలహేయప్రత్యనీకానంత జ్ఞానానందైక స్వరూపుడై, జ్ఞానశక్త్యాది కల్యాణ గుణగణ భూషితుడై, సకల జగత్సర్గస్థితి సంహారకర్తయై, "ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ" అను నాలుగు విధములైన పురుషులకును ఆశ్రయింప తగిన వాడై, ధర్మము - అర్థము - కామము- మోక్షము అనునట్టి నాలుగు విధములైన ఫలముల ననుగ్రహించు వాడై, విలక్షణ విగ్రహయుక్తుడై, లక్ష్మీ- భూమి - నీళా నాయకుడై యుండును. |
| 142) అఖిల హేయప్రత్యనీకనాగై యావదు తమస్సుక్కు తేజస్సుపోలేయుమ్, సర్పత్తుక్కు గరుడనైప్పోలేయుమ్ వికారాది దోషఙ్గళుక్కు ప్రతిభట నాయిరుక్కై. | | 142) అఖిలహేయప్రత్యనీకుడై యుండుట యనగ - చీకటికి తేజస్సు వలెను సర్పమునకు గరుడుడు వలెను వికారాది దోషములకు ప్రతిభటుడై యుండుట. |
| 143) అనన్తనాగై యావదు-నిత్యనాయ్, చేతనా చేతనఙ్గళుక్కు వ్యాపకనాయ్, అన్తర్యామియా యిరుక్కై. | | 143) అనంతుడై యుండుట యనగ - నిత్యుడై, చేతనా చేతనములకు వ్యాపకుడై, అంతర్యామియై యుండుట. |
| 144) అన్తర్యామియానాల్ దోషఙ్గళ్ వారాదో వెన్నిల్. | | 144) అంతర్యామియైనచో దోషము లంటవా యనినచో. |
| 145) శరీరగతఙ్గళాన బాల్యాదిగళ్ జీవాత్మా వుక్కు వారాదాప్పోలే త్రివిధ చేతనా చేతన దోషముమీశ్వరునుక్కు వారాదు. | | 145) శరీరగతములైన బాల్యాద్యవస్థలు జీవాత్మకు సంబంధించనటులనే త్రివిధములైన చేతనాచేతన దోషములును ఈశ్వరునకు అంటవు. |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| 146) జ్ఞానానన్దైక స్వరూపనాగై యావదు ఆనన్ద రూప జ్ఞాననాయిరుక్కై. | 146) జ్ఞానానందైక స్వరూపుడగుట యనగ ఆనందరూప జ్ఞానుడై యుండుట. |
| 147) అదావదు - కట్టడజ్ఞ వనుకూల మాయ్, ప్రకాశముమాయిరుక్కై. | 147) అనగా సంపూర్ణముగ అన్నియు అనుకూలములై ప్రకాశవములై యుండుట. |
| 148) ఇవనుడైయ జ్ఞానశక్త్యాది కల్యాణ గుణజ్ఞళ్ నిత్యజ్ఞళాయ్, నిస్సీమజ్ఞళాయ్, నిస్సఙ్ఖ్యజ్ఞళాయ్, నిరూపాధికజ్ఞళాయ్, నిర్దోషజ్ఞళాయ్, సమానాధిక రహితజ్ఞళాయిరుక్కుమ్. | 148) వీనియొక్క జ్ఞాన - శక్త్యాది కల్యాణ గుణములు నిత్యములై, హద్దులేనివై, అసంఖ్యేయములై, నిరుపాధికములై, నిర్దోషములై, తమతో సమానమైనవి గాని, తమ కంటె మించినవిగాని లేనివై యుండును. |
| 149) ఇవత్తిల్ వాత్సల్యాదిగళుక్కు విషయమనుకూలర్, శౌర్యాదిగళుక్కు విషయమ్ ప్రతికూలర్, ఇవత్తుక్కుక్కారణమాన జ్ఞానశక్త్యాదిగళుక్కెల్లారుమ్ విషయమ్. | 149) ఇందు వాత్సల్యాదులకు విషయ భూతులు అనుకూలురు. శౌర్యాదులకు విషయభూతులు ప్రతికూలురు, ఈ గుణములకు కారణములైన జ్ఞానశక్త్యాదులకు అందరును విషయభూతులే. |
| 150) జ్ఞానమజ్ఞర్క్కు, శక్తి అశక్తర్క్కు, క్షమై సాపరాధర్క్కు, కృపై దుఃఖిగళుక్కు, వాత్సల్యమ్ సదోషర్క్కు, శీలమ్ మన్దర్క్కు, ఆర్జవమ్ కుటిలర్క్కు, సౌహార్దమ్ దుష్ట హృదయర్క్కు, మార్దవమ్ విశ్లేషభీరుక్కళుక్కు, సౌలభ్యమ్ కాణవాశైప్పట్టవర్ కళుక్కు, ఇప్పడి యెఙ్గుమ్ కణ్డుకొళ్వదు. | 150) జ్ఞానము అజ్ఞానులకును, శక్తి అశక్తులకును, క్షమ అపరాధులకును, కృప దుఃఖితులకును, వాత్సల్యము దోషులకును, శీలము మందులకును, ఆర్జవము కుటిలులకును, సౌహార్దము దుష్టహృదయులకును, మార్దవము విశ్లేషముచే భయపడువారలకును, సౌలభ్యము దర్శించనాశవడు వారలకును విషయమగును. ఈ విధముగ అన్ని విషయములను జూచుకొనవలసినది. |

| ద్రావిడము | ఈశ్వర ప్రకరణము | ఆంధ్రము |
|---|---|---|

151) ఇప్పడి ఈశ్వరన్ కళ్యాణ గుణజ్గళోడే కూడి యిరుక్కై యాలే, పిఱర్నోవు కణ్డాల్ ఐయో! వెన్ఱిరజ్గి, అవర్గళుక్కె ప్పోదు మొక్కనన్మైయైచ్చిన్దిత్తు, తనక్కే యహాయిరుత్తల్, తనక్కుమ్ పిఱర్క్కుమ్ పొదువాయిరుత్తల్ శెయ్యాదే, నిలా తేన్ఱల్, చన్దనమ్, తణ్ణీర్పోలే పిఱర్క్కేయాయ్, తన్నై యాశ్రయిత్తవర్కళ్ పక్కల్ జన్మజ్ఞాన వృత్తజ్గళాలుణ్డాన నికర్షమ్ పారాదే, తాజ్గళుమ్ పిఱరుమ్ తఙ్గమల్లాదపోతు తాన్ తఙ్గమాయ్, సాన్దీపినిపుత్రనై యుమ్ వైదికన్ పుత్రర్కళైయుమ్ మీట్టుక్కొణ్డు వన్దాప్పోలే అరియన శెయ్దుమ్, అవర్ కళపేక్షితజ్గళై త్తలైక్కట్టియుమ్, అవరకళుక్కు ధ్రువ పదవెప్పోలే, వణ్డిల్లాదవత్తై యముణ్డాక్కియుమ్, తన్దామ్ స్వమ్ తాన్దామ్ వినియోగమ్ కొణ్డాప్పోలే యిరుక్క, తన్నైయుమ్ తన్నుడై మైయైయుమ్ వఴజ్గి అవర్కళ్ కార్యమ్ తలైక్కట్టినాల్ తాన్ కృత కృత్యనాయ్, తాన్శెయ్ద నన్మైకళై యుమ్ నినైయాదే అవర్కళ్ శెయ్ద సుకృతలవత్తైయే నినైత్తు అనాది కాలమ్ వాసితజ్గళాన రసజ్గళై మఱక్కుమ్పడి యెల్లాదశైయిలుమ్ ఇనియనాయ్, భార్యాపుత్రర్కళ్ కుత్తజ్గళై క్కాణాక్కణ్డిట్టిరుక్కుమ్

151) ఈ విధముగా ఈశ్వరుడు కల్యాణ గుణములతో కూడుకొని యుండుటచే, ఇతరుల బాధలను జూచినచో అయ్యో అని కనికరించి వారలకు ఎల్లప్పుడు ఒకేవిధముగ మంచినే సంకల్పించి, కేవలము స్వార్థపరుడై గాని లేక స్వార్థము - పరార్థము రెండింటిని పొదువుగా కలిగి యుండుటగాని లేకుండగ వెన్నెల - మలయ మారుతమ్ - చందనము - చల్లని జలము వీనివలె కేవలము ఇతరుల కొరకే అయి, తనను ఆశ్రయించిన వారలపట్ల జన్మచే గాని, జ్ఞానముచేగాని, ప్రవర్తనచేగాని, కలుగు నీచత్వమును జూడక, తమంతట తాముగాని, లేక యితరులుగాని, రక్షించజాలనట్టి స్థితిలో తాను రక్షకుడై సాందీపుని పుత్రుని, వైదికుని పుత్రుని బ్రతికించి తెచ్చినటుల దుర్లభములైన కృత్యములనుజేసి, భక్తుల యపేక్షితముల నెరవేర్చుచు, వారలకు ధ్రువపదము వంటి యిదివరలో లేనివాటిని నూతనముగ ఇచ్చియు, తమ తమ సొత్తులను, తాము వినియోగించు కొనునటుల తనను, తన శరీరమును వారలకై వినియోగించి వారల పని నెరవేరినచో తాను కృతకృత్యుడగుచు, తాను జేసిన మంచివాని

పురుషనైప్పోలే అవర్కళ్ కుత్తజ్గళై త్తిరువుళ్ళత్తాల్ నినైయాదే, కుత్తజ్గళై ప్పెరియపిరాట్టియార్ కాట్టినాలుమ్ అవళోడే మఱుతలైత్తు త్తిణ్ణియనాయ్ నిన్రు రక్షిత్తు, కామినియుడైయ అళుక్కుగక్కుమ్ కాముకనైప్పోలే అవర్కళ్ దోషఙ్గళై భోగ్యమాగక్కొణ్ఙు, అవర్గళ్ పక్కల్ కరణత్రయత్తాలుమ్ శెవ్వియనాయ్, పిరిన్దాల్, అవర్కళ్ వ్యసనమ్ కుళప్పడి యెన్నుమ్పడి తానీడుపట్టు అవర్కళుక్కు ప్రాజ్ఞకత్త నైత్తా(ఱ్వి)ట్టు, అవర్కళుక్కు క్కట్టవు మడిక్కవు మామ్పడి యెళియనాయ్, అన్నీన్రకన్రుక్కుత్తాయి రజ్గీ మున్నణైక్క నైయుమ్ పుల్లిడవన్దవర్కళైయుమ్ కొమ్బిలుమ్ కుళమ్బిలు మేర్కు మాపోలే, పెరియపిరాట్టియారైయుమ్ సూరికళైయుమ్ విట్టుస్నేహిత్తుక్కొణ్ఙు పోరుమ్.

నొక్క దానిని కూడ స్మరించకుండగ, వారలు జేసిన సుకృత లవములనే స్మరించుచు అనాదికాలము నుండి యున్నట్టి రసములను మరచునటుల అన్ని స్థితులలోను భోగ్యభూతుడై, భార్యాపుత్రులు చేసిన దోషములను జూచియు జూడనటుల ప్రవర్తించు పురుషుడు వలెనే, వారల దోషములను మనసా కూడ తలంచకుండగ లక్ష్మీదేవి ఆ దోషములను జూపినను ఆమెతో ఎదురువాదించి, దృఢ చిత్తుడై యుండి రక్షించుచు, ప్రియురాలి యొక్క మాలిన్యమునకు ఆనందించు కాముకుడు వలె భక్తుల దోషములను భోగ్యముగ స్వీకరించి, వారలపట్ల మనోవాక్కాయ కర్మల ఋజువర్తనుడై, విశ్లేషించినచో వారలనుభవించు దుఃఖము గోష్పాదము వలె చిన్నదిగ తోచునటుల తాను ప్రేమించి వారల కనువగు నటుల తనను సులభుడుగ మార్చుకొని వారలకు కట్టుటకును కొట్టుటకు కూడ సులభుడై, ఆనాడు ఈనిన దూడకు దాని తల్లి ప్రేమతో అంతకు ముందు కనిన దూడను - గడ్డిని వేయ వచ్చిన వారలను కొమ్ములతో కుమ్మియు, డెక్కలతో తన్ని త్రొక్కియు బాధించు నటువలెనే, లక్ష్మీదేవినిన్ని,

నిత్యసూరులనున్ను విడిచి, ఇట్టి భక్తునితో స్నేహము గలవాడై యుండును.

152) ఇవనే సకలజగత్తుక్కుమ్ కారణ భూతన్.

152) ఈయనయే సమస్త జగత్తునకును కారణభూతుడు.

153) శిలర్ పరమాణువై కారణమెన్నార్కళ్.

153) కొందరు పరమాణువును జగత్కారణ మనిరి.

154) పరమాణువిల్ ప్రమాణమిల్లా మైయాలుమ్ శ్రుతివిరోధత్తాలుమ్ అదు శేరాదు.

154) పరమాణువు కారణమనుటలో ప్రమాణమేదియు లేకుండుట వలనను, శ్రుతి విరోధము వలనను అటులన వీలులేదు.

155) కాపిలర్ ప్రధానమ్ కారణమెన్నార్ కళ్.

155) కాపిలులు ప్రకృతి కారణ మనిరి.

156) ప్రధానమ్ అచేతనమాగైయాలుమ్, ఈశ్వర నధిష్ఠియాదపోదు పరిణమిక్క మాట్టామైయాలుమ్, సృష్టిసంహార వ్యవస్థై కూడామైయాలుమ్ అదువుమ్ శేరాదు.

156) ప్రకృతి యచేతనమైన దగుట వలనను, ఈశ్వరుడు అధిష్ఠించి యుండనిచో పరిణమించ జాలనిది యగుట వలనను, సృష్టి సంహార వ్యవస్థ కుదరనందు వలనను, అదియు కుదరదు.

157) చేతననుమ్ కారణమాగమాట్టాన్.

157) చేతనుడు కూడ కారణము కాజాలడు.

158) కర్మపరతన్త్రనుమాయ్, దుఃఖియుమాయిరుక్కైయాలే.

158) కర్మకు పరతంత్రుడై దుఃఖియునై యుండుట వలన

159) ఆగైయాల్, ఈశ్వరనే జగత్తుక్కు కారణమ్.

159) కాన ఈశ్వరుడు మాత్రమే జగత్తునకు కారణభూతుడు.

160) ఇవన్ కారణమాగిఱదు-అవిద్యా కర్మ పరనియోగాదిగళా లన్రిక్కే స్వేచ్ఛై యాలే.

160) ఈయన అవిద్య - కర్మ ఇత్యాది ఇతరముల వలన గాక తన యిచ్ఛా మాత్రము వలననే కారణుడగు చున్నాడు.

| ద్రావిడము | ఈశ్వర ప్రకరణము | ఆంధ్రము |
|---|---|---|
| 161) స్వసఙ్కల్పత్తాలే శెయ్‌గైయాలే ఇదు తాన్ వరుత్త మత్తిరుక్కుమ్. | | 161) తన సంకల్ప మాత్రమున చేయుట వలననే కార్యము ఎట్టి కష్టము కానిదై యుండును. |
| 162) ఇదుక్కు ప్రయోజనమ్ కేవలలీలై. | | 162) ఇందులకు ప్రయోజనము కేవలము లీల. |
| 163) ఆనాల్, సంహారత్తిల్ లీలైకులైయాదో వెన్నిల్. | | 163) అయినచో సంహారమున లీలకు భంగము వాటిల్లదాయనగ - |
| 164) సంహారన్దానుమ్ లీలైయాగైయాలే కులైయాదు. | | 164) సంహారము కూడ లీలయగుటచే లీలకు భంగమేమియులేదు. |
| 165) ఇవన్, తానే-జగత్తాయ్ పరిణమిక్కై యాలే,ఉపాదానముమా యిరుక్కుమ్. | | 165) ఈయన జగత్స్వరూపుడై పరిణమించుట వలన ఉపాదాన కారణుడు కూడ నగుచున్నాడు. |
| 166) ఆనాల్, నిర్వికారనెన్నుమ్బడి యెన్నెన్నిల్. | | 166) అయినచో నిర్వికారుడనుట ఎటుల అనినచో - |
| 167) స్వరూపత్తుక్కు వికారమిల్లామైయాలే. | | 167) స్వరూపమునకు వికారము లేకుండుట వలన |
| 168) ఆనాల్, పరిణామముణ్డామ్బడి యెన్నెన్నిల్. | | 168) అయినచో పరిణామ మెటుల కలుగుచున్నదనినచో |
| 169) విశిష్టవిశేషణసద్వారకమాగ. | | 169) అపృథక్ సిద్ధములై యుండు చిదచిత్తుల యొక్క సూక్ష్మస్థూలావస్థల ద్వారా. |
| 170) ఒరుశిలన్దిక్కుణ్డాన స్వభావమ్ సర్వశక్తిక్కుక్కూడాదొ క్రి యాదిరే. | | 170) ఒక సాలెపురుగునకు గల స్వభావము సర్వశక్తిమంతునకు అసంభవము కాదు గద. |
| 171) ఈశ్వరన్ సృష్టిక్కైయావదు అచిత్తై ప్పరిణమిప్పిక్కైయుమ్ చేతననుక్కు | | 171) ఈశ్వరుడు సృష్టించుట యనగ అచిత్తును పరిణమింప జేయుట |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| శరీరేన్ద్రియఙ్గళైక్కొడుత్తు జ్ఞానవికాసత్తై ప్పణ్ణుగైయుమ్. | యును, చేతనునకు శరీరేంద్రియములనిచ్చి జ్ఞానవికాసమును కలిగింపజేయుటయును. |
| 172) స్థితిప్పిక్కైయావదు - సృష్టమానవస్తుక్కళిలే పయిరుక్కు నీర్‌నిలై పోలే అనుకూలమాగ ప్రవేశిత్తు నిన్ఱు సర్వరక్షైకళైయుమ్ పణ్ణుగై. | 172) స్థితిని జేయుట యనగ - సృజింపబడిన వస్తువులలో, పయిరునకు పెట్టు నీరువలె, అనుకూలముగ ప్రవేశించియుండి అన్ని విధములైన రక్షణలను జేయుట. |
| 173) సంహరిక్కైయావదు - అవినీతనాన పుత్రనై, పితావిలఙ్గిట్టు వైక్కుమాప్పోలే, విషయాన్తరఙ్గళిలే కైవళరుకిఱ కరణఙ్గళై క్కులైత్తిట్టు వైక్కై. | 173) సంహారమును జేయుటయనగ - అవినీతుడైన పుత్రుని, తండ్రి సంకెళ్ళను వైచియుంచునటులనే, విషయాంతరముల యందు ప్రవర్తించుచుండు ఇంద్రియములను వృత్తి రహితములుగ జేసి యుంచుట. |
| 174) ఇమ్మూన్ఱుమ్ తనిత్తనియే నాలు ప్రకారమాయిరుక్కుమ్. | 174) ఈ మూడు కృత్యములు ప్రత్యేక ప్రత్యేకముగ నాలుగేసి విధములుగ నుండును. |
| 175) సృష్టియిల్ బ్రహ్మవుక్కుమ్, ప్రజాపతికళుక్కుమ్, కాలత్తుక్కుమ్, సకల జన్తుక్కళుక్కుమ్ అన్తర్యామియాయ్ రజోగుణత్తోడేకూడి సృష్టిక్కుమ్. | 175) సృష్టియందు బ్రహ్మకును, ప్రజాపతులకును, కాలమునకును, సకల జంతువులకును అంతర్యామియై రజోగుణముతో కూడుకొని సృజించును. |
| 176) స్థితియిల్ విష్ణ్వాదిరూపేణ అవతరిత్తు, మన్వాదిముఖేన శాస్త్రఙ్గళై ప్రవర్తిప్పిత్తు, నల్వళికాట్టి, కాలత్తుక్కుమ్ సకల భూతఙ్గళుక్కు మన్తర్యా | 176) స్థితియందు విష్ణురూపమున అవతరించి, మన్వాదుల ద్వారా శాస్త్రములను ప్రవర్తింపజేసి, మంచి మార్గమును జూపించి, కాలమునకును, సకల భూతములకును |

| ద్రావిడము | ఆంధ్రము |
|---|---|
| మియాయ్, సత్వ గుణత్తోడేకూడి స్థితిప్పిక్కుమ్. | అంతర్యామియై సత్వగుణముతో కూడుకొని రక్షించును. |
| 177) సంహారత్తిల్ రుద్రనుక్కుమ్, అగ్న్యన్త కాదిగళుక్కుమ్, కాలత్తుక్కుమ్, సకల భూతఙ్గళుక్కు మన్తర్యామియాయ్ తమోగుణత్తోడే కూడి సంహరిక్కుమ్. | 177) సంహారమునందు రుద్రునికిని, అగ్ని యముడు మున్నగు వారలకును, కాలమునకును, సకల భూతముల కును, అంతర్యామియైం తమో గుణములతో కూడుకొని సంహరిం చును. |
| 178) శిలరై సుఖిగళాగవుమ్ శిలరై దుఃఖి గళాగవుమ్ సృష్టిత్తాల్ ఈశ్వరనుక్కు వైషమ్య నైర్ఘృణ్యఙ్గళ్ వారాదోవెన్నిల్. | 178) కొంతమందిని సౌఖ్యవంతులుగను, కొంతమందిని దుఃఖవంతులుగను, సృజించినచో ఈశ్వరునికి వైషమ్య నైర్ఘృణ్యములు రావాయనినచో. |
| 179) కర్మమడియాగ చ్చెయ్గైయాలుమ్ మణ్తిన్న ప్రజైయై నాక్కిలే కుఱియిట్టు అఞ్జప్పణ్ణుమ్ మాతావైప్పోలే హిత పరనాయ్ చ్చెయ్గైయాలుమ్ వారాదు. | 179) కర్మననుసరించి జేయుటవలనను, మన్ను తిన్న పిల్లవానిని నాలుకపై చురకవేసి భయపెట్టు తల్లివలెనే హితపరుడై జేయుట వలనను రావు. |
| 180) ఇవన్దాన్ "మున్నీర్ ఞాలమ్పడైత్త వెమ్ముగిల్ వణ్ణన్" ఎన్గిఱపడియే సవిగ్రహనాయ్క్కొణ్డు సృష్ట్యాది గళైప్ప ణ్ణుమ్. | 180) ఈయన "మున్నీర్ ఞాలంపడైత్త వెమ్ముగిల్ వణ్ణన్" అను పాశురము నందు తెలిపినటుల, విగ్రహ యుక్తుడై సృష్ట్యాదులను జేయును. |
| 181) విగ్రహన్దాన్ స్వరూపగుణఙ్గళిలుం కాట్టిల్ అత్యన్తాభిమతమాయ్, స్వాను రూపమాయ్, నిత్యమాయ్, ఏక రూపమాయ్, శుద్ధసత్త్వాత్మకమాయ్, చేతన దేహమ్పోలే జ్ఞానమయమాన స్వరూపత్తై మఱైక్కై యన్ఱిక్కే మాణిక్కచ్చెప్పిలే పొన్నైయిట్టుత్తాప్పో | 181) విగ్రహము స్వరూపగుణముల కంటెను అత్యంతము అభిమతమై నదై, తన కనురూపమైనదై, నిత్యమై, ఏకరూపమై, శుద్ధ సత్త్వాత్మకమైనదై, చేతనుని దేహము వలె జ్ఞానమయ మైన స్వరూపమును మరుగుపరచ కుండగ, మాణిక్యపు భరిణ యందు |

